శ్రీరస్తు 21







# శ్రీవిశ్వబ్రహ్మనామస్తోత్రాష్టకములు శ్రీమచ్చెన్నరాయ శతకము శివస్తవమునంచరత్నములు.

ఇవి

కృష్ణాకావేరిమధ్యదేశంబునంగల గుంటూరుజిల్లా పల్నాడుతాలూకా నాగులవరపుశివారు బెల్లముకొండవారిపాలెము కాపురస్తుడగు కూరపాటి రామదాసరాజు కొమారుడు కోటమరాజకవిచే రచియింపంబడి తద్గ్రామ నివాసుడగు సరికొండలక్ష్మీనృరశింహారాజకవిచే బరిష్కరింపంబడి నైజాంయిలాకా నల్గొండజిల్లా దేవరకొండతాలూకా చీతిరేల గ్రామాధికారియగు కాయితి వెంకటరామారెడ్డి గారి ప్రేరేపణచే తద్గ్రామనివాసుండగు గ్రంథకర్త విశ్వకర్మకులోద్భవుండగు కూరెళ్ల వెంకటరామాచారి ద్రవ్యసహాయముచే ప్రత్తిపాటి శేషయ్యగారి రాజ్యరమా ముద్రాక్షరశాలయందు ముద్రిపించి ప్రచురింపంబడియె.

మొదటికూర్పు 400

నర్సారావుపేట.

ప్రమాదీచనామసంవత్సర వైశాఖ బ ౧౦లు స్థిరవాసరంబున

1913

# శ్రీవిశ్వబ్రహ్మనామస్తోత్రాష్టకములు.

శ్రీకరా శ్రితకల్పకంబై చెన్ను మీరినసుందరా । ప్రకటోజ్జ్వల
కీర్తిచే వైభవమునందు పురందరా । లోకమునుజా నీకటాక్షకృపాకరారు
ణభీకరా । శేఖరాదిగవిశ్వకర్మకులాకరాయనమస్తుతే॥ 1 ॥ పల్లవాస్త్ర
నిభోలు నరకూరెళ్ళ వెంకటరామయం । మెల్లగా రక్షించితివి భూమెల్లగ
న్గానీదయం । బుల్లమున నీపాదములు నేర్పొప్పగా భజియించితీ । బల్లి
దుండవునీవువిశ్వబ్రహ్మనామనమస్తుతే ॥ 2 ॥ క్షేమకరకూరెళ్ళ వెంకటరా
ముభవ్యాచారిణీ । కామితార్థములిచ్చిబ్రోచినకలుషబృందవిదారని ।
వేమరకనన్నేలుసద్గుణధాముడవినే నోమితీ । రామచంద్రైనల లామవిశ్వబ్ర
హ్మనామస్తుతే ॥ 3 ॥ నీపదంబులునమ్మితినాయాపదలుపోజిమ్మితీ । పా
పసంఘములెల్ల గుమ్మితిపద్మసంభవసన్నుతా । శ్రీపతికిచక్రంబొసంగిన
నీపకావరరూపకా । ప్రాపుజేరితిస్వామి విశ్వబ్రహ్మనామనమస్తుతే ॥ 4
బంటుపంతముకైననీకుముక్కంటిసరిరానోడగా । కంటకుల దూలించు
టకునీవంటివాడిలలేడుగా । అంటియుంటకకంటిలో వెలుగయినీకళలేగ
దా । బంటనైవర్తింతువిశ్వబ్రహ్మనామనమస్తుతే ॥ 5 ॥ వెన్ననకుదా
నంబొసంగినసన్నుతాంగుడవేగదా । నిన్నునమ్మితినన్నుబ్రోవవె నిత్యభ
క్తశుభప్రదా । పన్నగాసచరా చరములకు ప్రభువువీవై నెల్లిప్రా ।
పన్నులనుపోషించువిశ్వబంహ్మనామనమస్తుతే॥ 6 ॥ముకురమునగన్నట్టె
రినలెముఖ్యుడనినింగ్గాంచితి । నకటశాస్త్రముల నుత్యజించితివిధినటం

చుభజించితీ । సకలమునకాధారివని నీసద్గుణములనుతించితీ । ప్రకటంభ వ్యవదాన్యవిశ్వబ్రహ్మనామనమస్తుతే ॥ 7 ॥తృష్టమణుమయశిల్పనరుల కుతాతవై తివినేటుగా । నిష్టలనుజెల్వొందితివివిస్పష్టముగశుభధాటిగా । అష్టమూర్తికి శూలమొసగిన యార్యపూజితవైభవా । భ్రష్టులను నిర శించువిశ్వబ్రహ్మనామనమస్తుతే ॥ 8 ॥ కోటిభాస్కర తేజనీకోసాటిగాు వ్వరుగాగుగా । కేటజేయక భోనవెనను శిల్పపాంతకసూటిగా । పా టలాధరమానివందిత పద్మనేత్రదయానిధే । పాటవంబునబుంచు విశ్వ బ్రహ్మనామనమస్తుతే ॥ 9 ॥ నీదుసంతతిపంచదాయులు నిరుపమాన యశోనిధుల్। వేదవేద్యులుసృష్టికర్తలువితరనాథ్యులుపిన్నరుల్ । శ్రీదని భసంపన్నులఖిలవశీకృత్యసౌఖ్యజ్ఞులు ।వాదభేదము లేనివిశ్వబ్రహ్మనామన మస్తుతే ॥ 10 ॥ భూతలంబుననిన్నుబోలిన దాతగలడెచూడగా । బ్రో తువెపుడుసూరివర్యుల ప్రీతిచేసిను వేడగా । నీతనూజులుసృష్టికర్తలు నీ నుసంతతినెంచగా । పాలకులుగారెచట విశ్వబ్రహ్మనామనమస్తుతే ॥11 ప్రణవమైయచలంబునీవై పంచభూతములీవయై ।త్రిణయనుండవునీవయై హరిధృహిణులకు మూలంబవై । గణనజెందితివీవెకద లోకములనేలుద యానిధే । ప్రణుతిజేతును నేడు విశ్వబ్రహ్మనామనమస్తుతే॥ 12 ॥కుండలే శ్వరకాండజాహిత కుహనసదృశయశోనిధీ । చండతరబాహాగ్రశాకవిసం న్నుతామలశోభితా । కాండజాసనవంద్యముని హితకనకకుండలమం డితా । పండితస్తవనియ్యవిశ్వబ్రహ్మనామనమస్తుతే ॥ 13 ॥పల్లవాస్త్రి సి బోలుచిగతీవల్లభుండవునీవెకా । చల్లగారక్షించదె ననుసతుప్రకాననపా వకా పుల్లపద్మదళాక్షుమమ్ములబ్రోవ వెఫలదాయకా । బల్లిదుండవునీవె విశ్వబ్రహ్మనామనమస్తుతే ॥ 14 ॥ సంతతమునాయంతరంగముసంతశిల్ల గజేయవె । చెంతజేరినవారిమనవిచిత్తగించిబ్రోవవె। చింతలనువిడనాడి నినుపూజింతునుననుగావవె । పంతమేలను నీకువిశ్వబ్రహ్మనామనమస్తు

దుదురుతత్వ మెరుగనిదానులూ । సామగుడుతన జేతిదివ్యాభరణమొల్లక జే
లమై। సాముకుబుసముదాల్చునటసద్భ్రహ్మానామునమస్తే॥24॥ నేమినేమ
నరాసిదీఅదియేమిదోచక్కయున్నది । నీమహాత్యంబెన్నతరమానిర్మలంబై
యున్నది । కామకులుగనదానికీ తన కామి తార్థంబిచ్చినది । రామనీల
శ్యామవిశ్వబ్రహ్మానామనమస్తే ॥ 25 ॥ హరిహరబ్రహ్మాదులకు వాయు
ధనులుగచించియూ । పురములనుసృష్టించియిచ్చిన భువనపతినని యెంచి
యూ । గురుతరముగజగద్గురుండని కోరి నిన్నేగాంచితి । వరమొసంగ నెవి
శ్వబ్రహ్మానామున మస్తే ॥ 26 ॥ భూమిలోపల చీతి రేలను పుణ్యుడై జె
ల్వొందెటి ।శ్రీమహాశ్రీ శేష వేంకట రామయ్యనుపాలించెరి । నీమహాత్యం
బెన్నతరమెసిరుపమానయకోధరా। సామకుడనైనొల్లువిశ్వబ్రహ్మానామునమ
స్తే ॥ 27 ॥ కారాపాటిసునంశుజుండనుగుణకృపాభరితుండనూ। ధీరకోట్ల
మరాజనంగను తె జరిల్లుక వీంద్రుడం । చారుతారల మీరుచుండేటివతర
తింసచియించితి । వారిజాసనసంధ్యవిశ్వబ్రహ్మానామునమస్తే ॥ 28

మంగళహారతి.

మంగాళమనరేశ్రీమహనీయూడగవిశ్వబ్రహ్మమునకుశుభ ॥ మం
గ॥ రంగుమీరారగరారెరాజీనముఖాలారబంగారునీవాళిపళ్లెముగోని।హం
సగనుసురపుంగవులసారంగయానలుయింగితంబుగపొంగుచునుసుమవృష్టి
గురియశెలంగుచుంన్ననుతాంగుణకుజయ ॥మంగళ ॥అంచితముగను ప్ర
పంచామున్సృష్టించి మించీననయశాలీకీ ।పంచదాయులవారి సంచీతకర
ముల్ద్రుంచి పోషించినపంచాస్త్రిసమునాకు నంచనాసేయూక బుధజనన
గుల మొనయాలించిబ్రోచివధించెపగతులమదమునను ప్రార్థించిదితెర
క్షించుమవిభునకు ॥ మంగళం ॥ కారుణ్యమూనభూతిగణమూలకును మో
క్షగతులిచ్చుఘనశీలికి । మేరుపర్వతసదృశధీరుడై వార్థిగంభీరుడై భట
పరీవారాములనుగాచీ । తారనారదపారదంబులగేరుచుండెటికీర్తిగలస
ర్దారుడై కూరెళ్లి వెంకట రామయ్యను పోషించువిభునకు ॥ మంగళం ॥

సంపూర్ణం.




శ్రీజానకీమణీచిత్తపంకజపూష ♦ పాండవపరితోష భవ్యవేష ।
పాలింపవె నన్ను బర్హిబర్హవిభూష ♦ భాస్వద్విలాససంపద్విశేష । అమ
రద్విషద్వేషకమనీయసంతోష ♦ జితకీర్తిబలతేజధృతిమనీష । హరిస
మరోష ♦ బ్రహ్మానందకరభాష । సతతనిర్దోషకంసగళశోష । ప్రణు
తఫణిభూషసనకాదిభక్తపోష । చార్వమతదూషరక్షితజగదశేష । రహి
నికూరెళ్ల వెంకటరామపోష । చీతిరేల పురినికాయచన్నరాయ ॥౧॥ ద్రు
చిరవిధాత్రిధూర్జటిధర్మంబునెరి శాశ్వతంబగు నీవరంబు । నగుబోటు శే
యకనన్నేలునసిశంబు వందితంబవని నీసుందరంబు । హితమతిచేతమాకి
య్యవేభాగ్యంబువినుతింపదరమె నీవిక్రమంబు । నిరుపమమైమించునీదు
దాతృత్వంబునిజరానందంబునీగృహంబు । వాసవనుతంబునీలసద్వైభ
వంబు । వర్ణితంబుధరి[illegible]వాక్చయంబు । రహినికూరెళ్లవెంకటరామ
పోష । చీతిరేలపురనికాయచెన్నరాయ ॥౨॥ నీయురస్థలియందునిల్చెనునీ
రాణిసన్నుతింతునునిన్నెచక్రపాణి । స్థిరతంబుగనిన్నుజెందెనుభద్రశ్రేణిధర
మిత్రవిందనీతలిరుబోణి । ముదమొప్పనినుగూడెమువ్వంకపూబోణినిజగ
త్సుములమూటనీదువాణి । నీసుతోబుట్టువైనెగడెనుశార్వాణిసైకతశ్రో
ణిభాస్వద్ఘరాణి । నిన్నుబెంచెనునందునినీలవేణి । పూజజేసెనునినుబోయ
పూవుబోణి । లహినికూరెళ్లవెంకటరామపోష । చీతిరేలపురినికాయచ

న్నరాయ॥౩॥ నాకోర్కెలీకున్న నీకుని వెయ్యనన్నా మున్ను వినకున్న నడువదేన ।
ధరణిని నీపదభక్తి విరివిగా నేనూనకొ మరచ్చ నీకేవకుడనుగాన । సీతామహా
దేవి చెలువప్ప నీచాన శాఖామృగము లెల్ల నీకు సేన । దయచేత నీకుబ్జ గంధము
బూసితివి మేనవిలశిల్లితి పయదుకులమున గోన । వేడ్కతో నన్ను రక్షించవే
బిరాన ।। శ్రియమైమించు నీ శ్వసజేయలేన । రహినిక్కూరెళ్ళ వెంకటరామపోష
చీతిరేలపురనికాయ చన్నరాయ ॥౪॥ చెలికాని మోహింపజేసెను నీరూపు నీ
కెదురించగా నెవ్వడోపు । విరివిగా ననుజూడ వేడయ గలచూపు శిరిజేరెనే
గనీయురమూదాపు। ముద మొప్ప శిరిగట్టి మాసెను నీ నీపు గొల్లలెదంగు నీగొడ్ల
కాపు । పగతుల జంప నీపటుమగల్గిన చూపు నిజ రావళికెల్ల నీ దె సాపు। మురి
పిచవిగాన నెరుగు నీ మూంపితీపు । మున్ను నే జేయుదు దోషములను బాపు।
రహినిక్కూరెళ్ళ వెంకటరామపోష । చీతిరేలపురనికాయ చన్నరాయ ॥౫॥ ము
నురోటగట్టను నిను గొట్టు నీ తల్లి పొంచెను నన్ను సంపదము తల్లి। ముద మొప్ప సుర
లునినోన్మహించిగటతో ల్లికాంతకిచ్చితి పీవు కల్పవల్లి । నిను వేడనాచిత్తసవ
జంబువికశిల్లి నినుగోర రాఘవ పన్నీరు జల్లి। నిన్ను బెంచిన చిన్ని నిగమంబు వేపల్లి
యకళంక నీపక్కి ముఖముబొల్లి । పగగనీకుని వాసంబు పాలవెల్లి । ధరణి
మాతల్లి సిరాణితల్లి తల్లి । రహినిక్కూరెళ్ళ వెంకటరామపోష । చీతిరేలపుర
నికాయ చన్నరాయ ॥౬॥ నిజమరులెవ్వరైన నీతోటి సరిరారు దిక్కు నీ
వని వేడనొక్కరు గారు । శ్రీమించుచున్న నీమోము చందరు గేగుని గనిగల్గడి
డేరు నీకరారు । నీ దేహకాంతులు నీలాభ్రము ను మీరు పాకశాసనుడంపె
నీకు తేరు। గావింతు నీకు నేవే వేళ జోహారు నీ పాత్ర్యన కుశింజి నీదు పోరు । వసుధ
లోపల నీవంటి వారు లేరు । వాసి జెందిన దేవర వారె మీరు । రహినిక్కూరెళ్ళ
వెంకటరామపోష । చీతిరేలపురనికాయ చెన్నరాయ ॥౭॥ కర మొప్ప నిను
జెందకల్యాణరింభోళిప లుపొందె నీతోడబుట్టి కాళి । సలిపితివట గొల్లచెలు
లతో మరుకేళి పరమపావనము నీపాదధూళి । నీపదంబున మొల్సె నింగి కేళాకూ

శిసిరన్నల మైమించుదువా౦శి। నీకు పాలిచ్చిన సలతుకగయ్యా శ్రీదేవిచేశిరికిగట్టి శిపితాళిని । నినుతిరువక్రివరించి జెం గెనువిరాళి। నిన్ను మోహించిరటమున్ను నిజగ రాళి । రహీనికూరెళ వెంకట రామపోష । చీతిరేలపురసికాయచన్న రాయ ॥౮॥ సన్నుతింతునునిన్ను సాగరగాంభీర్యశరణు జేతునునీకు శైలధైర్య । నాగకంకణసుతనయతర చాతుర్యపురుహూతవందితభోగధుర్య । సకలబృందారక స్తవయ్య సౌందర్యశిగులియ్య వేమాకుశిహ్మశౌర్య। సద్బుధ నికురుంబసంరక్షితౌదార్యరక్షించ వెనన్ను రాజవర్య । భక్తహృత్పద్మవస సుగార్యభవవిదార్య ॥ మౌనితాపనివార్యధర్మహితకార్య । రహీనికూరెళ వెంకటరామపోష । చీతిరేలపురసికాయచన్నరాయ ॥౯॥ మూడులోకములందు లేడటనీకుద్ది సురలినేలితివికస్తూరిదిద్ది । కృపజూడకున్న నీకీర్తి చేతనురద్దిధన్యుండనౌటకుదారి యెద్ది । యిక మోక్షమీకున్న నెంతునానీ సుద్దిసన్నుతింతునునిన్నుశక్తికొద్ది । పరగదంటివిగోపబాలకులిడుసద్దుని మెనీబంటులంఖిణినిగ్రుద్ది । కపివరులగూడికడితివికడలికుద్ది। శింగమైజేరితివి శైలశిలలలొద్ది । రహీనికూరెళ వెంకటరామపోష । చీతిరాలపురనికాయచన్నరాయ ॥౧౦॥ నీకౌమారుడు వేల్పుమూకలలో పెద్దన్నపపుంగవుల లోననీవు పెద్ద । నీకులశీలంబు లోకంబులోనిద్ద పరగమాకియ్యావే పసిడిముద్ద । దాతవీవని పైడిదాచితినీవద్ద భువిలోననీజక్క బొల్లిగద్ద । పరగనీడాకన్ననురలబోనపుముద్ద మె[illegible]వెనీచెలికాడు విసపుముద్ద । అలయశోదమ్మ కస్తూరితిలకముద్ద । కందు వై పెరిగితివయ్యా నందునొద్ద । రహీని కూరెళ వెంకటరామపోష చీతిరేలపుర నికాయచన్నరాయ ॥౧౧॥ మొరబెట్టితెరియించె ధరణిలోనొక కాకినీకీర్తి రాణించెనింగి బాకి । నిన్నుదూషణ జెసినీ లైదునొక చాకినినుగొట్టిగో పెమ్మనిన్ను సాకి । మడసెఖరుండుదు ర్దమునవినుదాకి నీమాయగనడాయెనె పినాకి । నినుగొల్చి నందుకునీవు

నా కెఁశాకిఘనుడవై తివిసురగణములోకి । పరగనీ కంటెపుడమి నెన్నఁడుధనీ
కి।యవనిని న్నేఁకిసంపన్ను డగువివేకి। రహినికూరెళ వెంకటరామపోష । చీ
తి రేలపురనికాయచన్న రాయ ॥౧౨॥ వికటులజంపెనీచికిలి జేసనబాకుశ్రీ
లోనంగితివేనిజాలుమాకు । రాధమొరుంగునీరాజసంబగుతీకుహాదివనిజేతు
జోహారునీకు ।దేవరవారికిదెల్పుచుందుపరాకుపన్ను గా జేయకునన్నలాకు।
మామగదాయనిమన్నించితివిపీకు నెలదికై తెచ్చితౌ వేల్పునూకు । ముద
మొసగి జేయు కేనాదుమదిచికాకు । నన్నుబ్రోచిననీకీర్తిమిన్నుబ్రాకు । ర
హినికూరుళ వెంకట రామపోష।చీతి రేలపురనికాయచన్న రాయ॥౧౩॥భక్తి
చిత్తాబ్జములబలు వైచనీయుల్లుపతితాకున్నదనుచు ద్రుంచితివిమల్లు । వనజ
యుద్రపడమమైబగగునునీవిల్లుముల్లోకములనీదుముద్రదెల్లు । నీకుకోపము
గల్గలోకముఘూర్ణిల్లుముద మొందు నీవాజిమోముగల్లు । నిఖిలజగం
బుల నీకీర్తివిలశిల్లుగూలిరిమీవారుద్రోలికల్లు । నీటుచేరాధనీకుపన్నీరు
జల్లు । ధరణినినుదాకుపగతులుతల్లడిల్ల । రహినికూరెళ వెంకటరామపో
ష । చీతి రేలపురనికాయచన్నరాయ ॥౧౪॥ నీయనుగ్రహమున నేజెంనెద
నుమక్తినేవిడనెపుడునీదు భక్తి । పుట్టింపపోషింపగిట్టింపనీతక్తియనని
నన్నేలుసదానురక్తి । లలినివేవేలవక్కాల్జేసునీయుక్తిబాణుడెరుంగునీశా
హాశక్తి । కరమొప్పనిన్ను నేగాంచెదనాసక్తిమన్నించిమొనగవమాకు
భుక్తి । గలుగజేయువెదుప్పసంగతువిరక్తి । పితతహరనీదుతల్లిగర్భంబెతు
క్తి । రహినికూరెళవెంకటరామపోష । చీతిరాలపురనికాయచన్నరాయ॥
౧౫॥ ముదమొప్పనీపాదములునమ్మితివైదేహినుండకేదగురావణుండద్రోహి।నీ
శయ్యయైధాత్రినెగడెను శేషాహిగాసిచెనిన్నోడెకాళియాహి । నీపగతులకె
ల్లనీకత్తికాలాహియవనినీపుత్రిమహాపవ్రవాహి । నీబావజనకుండునిరతం
బునిర్మోహిభవ్యమైమించునీభార్యపద్మగేహి । భక్తిచేగొల్తువేదమూం
పాహిపాహి । రహినికూరెళవెంకటరామపోష । చీతిరేలపురనికాయచన్న

రాయ ॥౧౬॥ నీమాయ(బహ్మాండ నివహంబులకుగప్పు నాకిష్టమీకున్న నీకుతప్పు । నిన్నుదూపించుట స్త్రీవైరులకు ముప్పునీదాసుల సవాళ్లునీకు మెప్పు । పంకజనాభ నాభవబంధములవిప్పు తరియించుటకునాకు దారిజె ప్పు । నిమపూజ జేసినజనులకు పెంపొప్పు రాధపన్నీరునీమీాదగుప్పు । పు డమినిన్నేడ దెప్పుడుబడిమిదిక్కు। కలువచిత్తుండు నీపాదగనినరొప్పు । రహి ని కూరెళవెంకటరామపోష । చీతిరాలపురనికాయచన్నరాయ ॥౧౭॥ యే లరాయింతజాగేలరా యీాచలమేలరా బాలగోపాలనీకు । క్రోధమానా మీాదవాదమాదారిద్ర ఖేదునిజేయుట మోదమేన । యెంతురానిన్నే భ జింతురానీమూర్తి గాంతురానిను సత్యవంతుడనుచు । వింటిరానీకధల్ గంటిరానీమాయ గొంటిరా నీనామ కోటులెల్ల । నంటియుంటనినీపుము క్కంటిజంట । వంటశుభమిమ్మటంటి దైత్యారివంటి । రహినికూరెళ వెంకటరామపోష । చీతిరేల పురనికాయచన్నరాయ ॥౧౮॥ నేజేయుత ప్పుమన్నించవేనూయయ్య మోకమీాకున్న నేమొక్కువెయ్య ।పాలిం చవేనన్నుభద్రాదిరామయ్య సద్గతినియ్యవే చక్కనయ్య । రహినినిన్నే డితి రక్షించరావయ్య తగితొత్రివక్రి గంధంబుబుయ్య । చెలువలదొగనీ కు చెలువొప్పగాశయ్య యమరులు నిన్నేడిగద్రిమొయ్య । మూఖమున నెత్తితివిహస్తిపురముడయ్య । యిపుడునీదయరాకున్న నేమిజెయ్య । రహి నికూరెళవెంకటరామపోష । చీతిరేలపురనికాయచన్నరాయ ॥౧౯॥ క రమొప్పగా నిన్నువ[illegible]ంచె మునులచ్చివిలశిల్లినమరులు జలధిద్రచ్చి । మాండవ్యుడలరె యుష్మద్గర్భమునజొచ్చిసన్నుతించెనుశూలిసిన్నుమెచ్చి। నినుదూరెకురురాజు నీటిలోపలహెచ్చి భ్రమయించెనిన్ను శూర్పణఖ వచ్చి । నిందించెగదవాలి నీకోలచేనొచ్చి రక్షించనేనన్ను మోతుమిచ్చి జెందెనినుసాళ్వుడపుడునీచేతజచ్చి।గూడితివిమూాడునంకల చేద్రగుచ్చి । రహినికూరెళవెంకటరామపోష । చీతిరేలపురనికాయచన్నరాయ ॥౨౦॥

నిన్ను పూజించితినీదయనేగోరి పన్నుగానెగడెనీయన్నసిరి । వినుతింతునిన్ను నేదనుజబృందవిదారిదీపితా కారిలోకోపకారి । శోభితసువిచారి వైభవ పాకారికవిజనోద్ధారిసంగరసజితారి।నీచెంత నేజేరినిన్నెంతుసరదారి దాతవీ వెననివేతుభేరి । యితరదేవతలందరినిపుడుగేరి । నీప్రచారంబుగణుతింతు నేమురారి । రహినికూరెళవెంకటరామపోష । చీతిరేలపురనికాయచన్న రాయ ॥౨౧॥ నీదర్పమునకు పయోధిజాలంబింతు నీవైరిసంఘముల్నీకు జంతు ।స్థిరనునీశయ్యయాశేషుండు ౼నువంకువసుధనిన్వికటించు వాడు గృంతు । చెలువప్పపూజజేసితివీవువృషభాంకు నేర్పొప్పబ్రోతువు నిష్క ళంకు। దివిజవర్గము కెల్ల దెలుసునునీ౼ంకుబవరానసీబావబల్కెబొంకు।లలిని నీమాటవిననిం౼రాజుమంకు। వె౼సెనీహస్తతలమునవలరిశంకు। రహినికూ రెళవెంకటరామపోష । చీతిరేలపురనికాయచన్న రాయ॥౨౨॥ ధర్మంబు నీకుయుద్ధమునందునరికాబు నీమీదనేజేతునెరిమురాబు । నరవాహనుడు నీకునమ్మినట్టిసరాబు వసుధనబ్రోచ నెవ్వడునబాబు । పుణ్యఫలంబులు పొలుపొందెనీజేబు నీసఖుడేమిచ్చునీదుజాబు । నిగమాంతజాలముల్నీవు మెచ్చుకితాబు । వైనతేయుడునీసవారియాబు ।మెచ్చినినురమ్మనినయాగ మేఖరాబు । దనుజ౼లెరుగుదు రిద్ధాత్రితమరిడాబు । రహినికూరెళవెంక ట రామపోష । చీతిరేలపురనికాయ చన్నరాయ ॥౨౩॥ ధరకంసునకునీ కుదగిలెబల్వెనుమొాకనీల్గిరిదైత్యులునిన్నుదాక । నీవైరిగాల్పించె నీబం టు వెనుతోక నేజైనమర్కటుల్నీకమూక । దండినీభక్తుల పండుగ నీ రాక వదలకననన్నేలనిదిపరాక । జలధిడాగితివి దానులబ్రోవగా లేకనీప దంబునబుట్టి నింగివాక । కానకంపించెనిను వైరమూని కైక । రాయిమ గువాయెనీపాదరజముసోక । రహినికూరెళవెంకటరామపోష । చీతిరేలపు రనికాయ చన్నరాయ ॥౨౪॥ చుక్కలకెనజెందిసొంపొందెనీగోళ్లునిర్జ రులెన్నెచ్చిరినీసవాళ్లు।నిఖిలజనవస్తనియ్యంబునీపళ్లు లోకేశమదనులునీకు

మాళ్లు । మించినీచెలికాడుద్యంచెనుమూడూళ్లు వెలయనీశయ్యకువెయ్యి నోళ్లు । అద్దముల్బోలునీనిద్దంపుచెక్కిళ్లు శ్రితులకిచ్చితివిశాశ్వతకవుళ్లు । ధరణినీవేణురవమునగరుగురాళ్లు । వాసిగానిన్నుమాకొనువాడుద్రెళ్లు । రహినికూరెళవెంకటరామపోష । చీతిరాయపురనికాయచన్నరాయ ॥ ౨౫ ॥ బహ్మాండభాండముల్పగులునీపల్ల । శ్రీష్టండవైతివిశిరులుగల్ల । ఖండించితివివైరిగణములు వెసనీల్లమహిమజెందితివీవుమణియుఖల్ల । నీకుభృత్యుడగాననీయాజ్ఞనేదొల్ల నెగడిరిమునులెల్లనీహితుల్ల । నీభక్త వర్గంబునీయాజ్ఞచేమొల్ల దేవాళినెల్లసాదితివిమేల్ల । గిరివరమునెత్తితివిసురాసురలునల్ల । బడియెనీచాతచాకలవాడుమూల్ల । రహినికూరెళ్లవెంకటరామపోష । చీతిరేలపురనికాయచన్నరాయ ॥ ౨౬ ॥ ధరణినీవుండుశ్వేత ద్వీపమదితెల్పు జడదంబుబోలునీయొడలునల్పు । నిగమంబులెల్లను నీమహాత్మ్యముతెల్పు తగ్గించితివిబాణదైత్యుబల్పు । గోవినావటనీవు గొల్లలపాల్కల్పు మిగులనీనామముల్మేలుసల్పు । శివినీప్రోలు గట్టినమెచ్చితవిశిల్పు శీఘ్రంబుననునిరశించుతువల్పు । భువినినాదుష్కృతములసంభోడిగల్పు । గంటివరిసేవలోచెలికానిగెల్పు । రహినికూరెళవెంకటరామపోష । చీతిరాలపురనికాయచన్నరామ ॥ ౨౭ ॥ కరమొప్పదేవకీ గర్భంబుననుబుట్టి నధికల్లితివిశత్రువరులగొట్టి । వధియించితివితృణావర్తునిమెడబట్టి । కడలిదాటితివిపుకట్టగట్టి । బడలించితివిపామునడుగులచేమట్టిధరనేలితివినీవువితాళిగట్టి జన్నముల్జేసినీయన్నజగజ్జట్టి ప్రసమించెనీమొలపైడిధట్టి । విమలపదవిమ్ము నాసంకటముల మొట్టి । ప్రౌఢవైతివిశ్రీకాళితోడబుట్టి । రహినికూరెళవెంకటరామపోష । చీతిరేలపురనికాయచన్నరాయ ॥ ౨౮ ముల్లోకముల లేడునల్లభనీజంటదేవనీతత్తడిదిడుగుమింట । నిగమసందితనేను నీబంటునకుబంటవెలయనీకొమరునివిల్లుతుంట । పరమాత్మయికనై బాపు బాకితంటపటుమచేద్రావితివటపమంట । భవుడైననీబావబట్టిబంగరుగం

టసామిత్రిదిరిగె నీసైగవెంట । వేమకొనువారి నేలెంకెరేపవంట । పరగమధి యింపనీయింటబండెపంట । రహినికూరెళ వెంకటరామపోష । చీతిరేల పురనికాయచన్నరాయ ॥౨౯॥ నీభక్తివిడకుంటినీకుదాసుడనంటినీకు నే శరణంటెనిన్నుగంటి । తండ్రివినీవంటిదాతవీవెనంటి ధన్యుడవనివింటిదల చుచుంటి । కన్నులపాడగంటి కరుణాకరుడవంటి కొనురప్పనీశేపకుండ నంటి । నీకథామృతము నేనిరతంబుచవిగంటి పుడమి నీపాదముల్వీడువ కుంటి । మహినిమత్పూర్వజన్మకర్మములగెంటి ।పరమదయచేతననుబ్రోచు ప్రభుడనంటి ।రహినికూరెళ వెంకటరామపోష। చీతిరేలపురనికాయచన్నరాయ ॥౩౦॥ ప్రేమనీతండ్రిరప్పించెరుప్యశ్శృంగు నీభక్తుడెవడైననిన్నెరుంగు । నరజరాసంధుని వధియించినదెఢంగు నిజకీర్తుల్ జేరిరినీమరుంగు వరదనిన్వేడినదురితంబులు దొలంగు ధాత్రైనగనలేను నీతెరంగు । నీదాసులనుజూచినీమనసాప్పంగు జగతినీకరుణకైజాపెకొంగు । లలితనీవేణురవమునరాల్గరంగు।ధరణినీయింటఘనసంపదలుశెలంగు।రహినికూరెళ వెంకటరామపోష । చీతిరేలపురకాయచన్నరాయ ॥౩౧॥ ఘనుడవీవనిబోదె కలికిజేసెనుచిందు ।నిరుపమశుభములునిన్నుజెందు । నెరిజగత్రయముల నీకీర్తిజెల్వొందు నీదుదాతృత్వంబు నేడుగందు ।నిఖిలరోగములకునీ నామమేమందునీకథజెప్పెవాల్మీకిముందు । ననుబ్రోవకున్నాపునాభాగ్యమేమందు శివునిబోధించెసిమివిపొందు । ధరణినీమంత్రమనిశంబు మరువకుందు । పగతుడెవడైననినుదాకిదిగులుజెందు । రహినికూరెళ వెంకటరామపోష । చీతిరేలపురనికాయ చన్నరాయ ॥౩౨॥ లోకేశనీదయ రాకున్ననెటుసైతు భువిలోననన్నుజేయవెపునీతు । శంబరమునుబ్రోచి జంపితివికిరాతు కొమరొప్పనీరామకోటివ్రాతు । నిర్మలహారముల్నీగళంబున వ్రేతునీమంత్రముపఠించినిన్నుజూతు। నిలలోనఖిలజనావళి పల్కుల కురోతునరనుత నేచందనంబుబూతు। ప్రేమనినుగొల్వనినరుండుపెద్దబొతు

శౌరినీపంచ జేరిజోహారు జేతు । రహినికూరెళ్ల వెంకటరామపోష । చీతిరే లపురినికాయ చెన్నరాయ ॥౩౩॥ నినుగాంచిముదమంది నిన్వేడ సప్తాచిశ శిరులియ్యవేనాడు సేదదీచిశ । కరిరాజుమొగబెట్టె వెరివిగానినుగూచిశ నిలుతురేపగతులునీకెదిచిశ దయచూడవెనాడు తాపంబుచల్లాచిశ । నే మంబునభజింతునేమిశోచిశ । పాలించునేడు మత్పాపముల్ తెగటా చిశ సన్నుతింతునునిన్నె శయ్యజేచిశ । పూజజేతునునీవ్రతంబులుదనర్చి నీకరుణగంటినీశవనేనొనర్చి । రహినికూరెళ్ల వెంకటరామపోష । చీతిరేల పురినికాయ చెన్నరాయ ॥౩౪॥ దేవదేవ్వకైన దెలియదు నీజాడనీభక్త వ్యాముదల్నీకు మేడ । పొలుపొందనిన్గన్న దొలుగుదుష్కృతపీడ కాశోద రారినెనీకుఘోడ । వినుతింతునొకసారివేవేలసిను నేడ దానుడనైదండ ధరునికోడ ।జగములునీవనైచరియించితివిచూడ మోహించిరతివలుపు రళిబాడ । పరగవిహరించినదియె వ్రేపల్లెవాడ । కాననము కేగితివినీవు కాంతతోడ । రహినికూరెళ్ల వెంకటరామపోష । చీతిరేలపురినికాయ చెన్నరాయ ॥౩౫॥ నీకృపగాంతును నిరతంబునిన్వేడి వర్ణింప నీమీది వలుపైపెడి । పంక్తికంధర పురిపై బెట్టితివిదాడి నెగడె సుగ్రీవుండునిన్ను గూడి । నీపటుశరమున నీల్గెబంగరులేడి భావింపనీకింకెదైవమేడి । గ్రో లితివటమున్ను గొల్లలావులపాడిమన్నించు నాతోటి మాటలాడి । ధరణి నీపురికేగిరిదైత్యులోడి । వెలయు భవదంఘ్రులకు నేనువేతుమోడి। రహిని కూరెళ్ల వెంకటరామపోష చీతిరేలపురినికాయ చెన్నరాయ ॥౩౬॥ బుధను తయగులసద్భావ దేవినీనా[illegible]లాసంగెనునీకు బాలఘాతి । నీకోలచేగూ లినినుదూరెనొక శోతి నీడజనాధుండునీకుపీతి నిండెబ్రహ్మాండంబు నీయ శో విఖ్యాతినిరుపమమైమించెనీదుభూతి ।నీకులముఖ్యుడై నెగడెమున్నయ యాతిరాణించితివి నీవురాజనీతి । భావమందున నినుగొల్చె దేవహూతి । పాతకులనెల్లద్రుంచునీచేతి హేతి । రహినికూరెళ్ల వెంకటరామపోష । చీ

తిరేలపురివికాయ చెన్నరాయ ॥32॥ కడలికికవుల జేగట్టించితౌ కట్టనెలయనీ హితునిదెవెండిగుట్ట । విరివిగాదయచూడవే పాపములుగిట్ట నింగివాకను గని నీదుమెట్ట । కోపించవైతివి గోపెంమ్మనినుగొట్ట । శ్రీలక్ష్మిప్రబలె నీకేలుబట్ట । ఘనుడవై విరత్న గర్భచనుల్ముట్ట । పాలుపొంగెనీతేజి బొల్లిపిట్ట । సాదెపదునాల్గులోక ముల్నీదుపొట్ట । నీదు మృదుశయ్య చిల్వలనెళవుపుట్ట। రహినికూరెళ్ల వెంకటరామపోష । చీతిరేలపురినికాయ చెన్నరాయ ॥35॥ కోరితెరాన్నివై కుంఠంబు నీనీకులోకంబులో లేడు నీకు జోడు । నీకృతిమెచ్చితే నిజమైన మాటాడు నీభక్తుడెపద్దెన నిన్నువేడు। ఘనమైననీ వెహాము కెనగాడు రేరేడు పృథివినీ కెదిరింప నెవ్వడీడు । ధరణి నీవెనువెంటడగిలెనీసైదోడు నీదాసజనులకు రాదుకీడు । బుట్టబోడుహరి త్రినిన్నోల్చువాడు । అలినిని నేగావలరాజుసూడు । రహినికూరెళ్లవెంక టరామపోష । చీతిరేలపురినికాయ చెన్నరాయ ॥36॥ నిన్నెత్తుకొనిపో యి నీలెచిల్వలదిండి । నీతన్నుచేగూలె రాతిబండి । దండినీవంగడీడుం డిన మలవెండిపాలించితివి పాముపై బరుండి । భువియందునీలోడ బుట్టెనె లతుకఘండి కోరినిన్నేవేడుపోరుదిండి । నీకీర్తిరాణించె లోకంబులనునిం డి వసుధనిన్నొవివాదులండి । జయముగొంటివి క్రూరరాక్షసులఘండి । మోక్షమీయుచున్ననీకునేమ్రొక్కనుండి ।రహినికూరెళ్లవెంకటరామపోష । చీతిరేలపురినికాయ చెన్నరాయ ॥ 40॥ ఘనుడైననీచెలికాడెక్కనదినం ది నెగడెను శుభములునిన్నుజెంది । నిన్నుప్రార్థించనిసిగ్భాగ్యుడే పం ది వసుధనిన్నుతించువాడెవంటి। పొంపొందితివిధనసంపదలను పొంది నీ రజాహితమూర్తినీమరంది సరిదుడనని నిన్నునరియించె కాళింది నీయు రంబుననిల్చెనీవెలంది । వెలయనినుగొల్తురెపుడు వేవేలమంది పరగనీసే నజేతును శిరులనొంది।రహినికూరెళ్లవెంకటరామపోష।చీతిరేల పురినికా య చెన్నరాయ ॥ 41॥ చెలులుమాహింపగ • జేసెనునీటు వన్నెలగు

ల్కు ♦ నీవర్లొవాటు । మన్నించినను బ్రోవ ♦ కున్న నీకేలోటు హెచ్చిన
కదలినీ ♦ రచ్చచోటు । భక్తిచేత నెనిన్ను ♦ ప్రార్థింతునొకమాటు వ
సుధనిన్వేడని ♦ వాడెమోటు । చెలువప్పగానను ♦ జేయకేనగుబాటు
కంసుడెరుంగు ♦ నీకత్తివేటు । జగతిపూజించితివిమున్ను ♦ చంద్రజూ
టు । పగతులకుగుండెనాటునీ ♦ బాకుపోటు । రహినికూరెళ్ల వెంకట
♦ రామపోష । చీతిరేలపురినికాయ ♦ చెన్నరాయ ॥౨౨॥ కూర్చింతివ
టమున్న కోరికోతులదండు ♦ వసుధనామససునిన్వదలకుంసు । నిక్కంబు
గనునీకుబ్రొమొక్కడునీచుడు ♦ నీకత్తిపగతులమూకచండు । మున్ను
బాంకించెను నిన్ను మారీచుండు ♦ నిటలాక్షుడవనిలో సీహితుండు । నీర
జ జన్ముండు నీకగ్రసుగానుండు ♦ నలనొప్పనినుగొల్చెవాయుజుండు ।దు
రితచిత్తుండు నీమామ ♦ దుర్మదుండు । భక్తిచేనిన్ను ప్రార్థించె ♦ ఫ
ల్గుణుండు । రహినికూరెళ్ల వెంకట ♦ రామపోష । చీతిరేలపురినికాయ
చెన్నరాయ ॥౨౩॥నీమధురోక్తులువిన్నలసుధలౌల్కు ♦ కాంతులనీనుకను
లబెళ్కు । జిగిమించుచుండు నీచెక్కుతళ్కునుతళ్కు ♦ నీమీదరాధ పన్నీ
రుజల్కు । పూర్వదేవతలకు పోలేదు నీయుల్కు ♦ గయుడునీశబ్దచే
గాంచెనళ్కు ।కడుదయచేనల్వకికిచితివిప్రాబల్కులకనులౌనీవేయునట్టిము
ల్కు ।లఘిపతి వృపునీవాడె♦నట్టిపల్కు 'వసుధలోపలనీ♦కీర్తివన్నెగుల్కు ।ర
హినికూరెళ్లవెంకట ♦ రామపోష ॥చీతిరేల పురినికాయ ♦ చెన్నరాయ॥
౨౪॥ పన్నగాసాళ్వుండు నిన్ను జేసెను నింద ♦ మేలుగాగాసితి వాలమం
ద । నీమీదపద్యముల్నొరచించితివంద । మేటివీవని గోరు మిత్రవింద ।
ముందుజొచ్చితివీవు మందరిగిరిక్రింద♦వినుతించితినినిన్ను విశ్వతుంద ♦ దు
రమొనర్చితి వీవునరమగుల్ భయమొంద ♦ నామొరవినిబ్రోవవేముకుం
ద। నెగడితివిభోగభాగ్యముల్♦ నిన్ను జెంద। మనవివినవేర ♦భక్తులమనసు
గుంద । రహినికూరెళ్లవెంకట ♦ రామపోష । చీతిరేలపురినికాయ ♦ చె

న్నరాయ ॥౨౫॥ నాగాంతకుడునీవు నమ్మినవరవాజి ♦ నీదాసజనులకు నీకురాజి । ఖరముర(ప్రముఖరాక్షసులగూల్చితివాజి ♦ సురపతినీయన్నసో మయాజి ♦ నినుదాకెయవనుండు నీవైరియగుఘాజి ♦ మున్నుదోడ్కొని పోయెనిన్నుయాజి । వెలయనీసఖునకు వృషభంబుగదతేజి ♦ వసుధనిన్నే డనివాడెఖాజి । చచ్చెనీచేతబవరాన ♦ శత్రుగాజి । లలిననీగోత్రముఖ్యుం డు ♦రాజిబీజి । రహినికూరెళ్లవెంకట ♦ రామపోష । చీతిరేల పురినికా య ♦ చెన్నరాయ ॥౨౬॥ఖలదానవులనెల్లఖండించెనీకత్తి ♦ నీకృపగాం తునునిన్నుహత్తి । నీచేతిచక్రంబు నీవైరులకుమిత్తి ♦ ప్రాకటంబుగని మ్ము నాకుముత్తి । దయచేయవేమాకుతరుగని సంపత్తి ♦ మేటివైవివిగి రిగోటనత్తి । మహిలోన నేనువేనూరనునీబత్తి ♦ నాకొంటినియ్యవె నా కుబుత్తి । ధార్మికుడనాదునీ ♦ దుపాదంబులో త్తి । మోక్షమొసగవె నాపావ ♦ ములను మొత్తి । రహినికూరెళ్ల వెంకట ♦ రామపోష । చీ తిరేలపురినికాయచెన్నరాయ ॥౨౭॥ నీవుమన్నింతువు నిత్యయోగాభ్యాసు రక్షించితివిమున్నురామదాసు । వేడ్కబ్రోచితివిశవిరసద్గుణవ్యాసు ♦ క మలాక్షునిసుగొల్చెకాళిదాసు । పాలించెదవుభ వత్పాదభక్త్యోల్లాసు♦గం టివిమరుని శృంగారభాసు । కొమరొప్ప నీమాట కోటినరాజేసు ♦ లా లించితీవైకైలాసవాసు । నీపురముజేర్చవట ♦ సద్వ్రతోపవాసు । గాసి నొందించితీవుభక్త ♦ పరిహాసు । రహినికూరెళ్లవెంకట ♦ రామపోష । చీతిరేలపురినికాయ ♦ చెన్నరాయ ॥౨౮॥ సూర్యవంశాబ్ధిభాస్వత్పూర్ణ కరసోమ ♦ కరుణాలలామ శృంగారకామ । పరమపావననామ భవ్య గుణస్తోమ ♦ వైభవ్రోద్ధామకాకాభిరామ । సాగరరిపు భీమశత్రుబృందవి రామ ♦ గురుతరక్షేమ వైకుంఠధామ । వర్ణితశుభనీమువందిత సూత్రా మ ♦ బలరామ శ్రీరామపరశురామ । సంతతక్షేమయాదవసార్వభౌమ దాసులముగామనీసేరు ♦ దలచుకోమ । రహినికూరెళ్ల వెంకట ♦ రామ

పోష చీతిరేల పురినికాయ ♦ చెన్నరాయ ॥౪౯॥ శిఖమింఛమేనీకు గ్రీ
ష్మమైనతుకాయి ♦ నిర్జరుల్ మెచ్చిరినీలడాయి । నీపాదరజమున నెలతయు
య్యేనురాయి ♦ క్షితిరాధగనెనీదురతిబడాయి చెలులనుమో ంపజేసె
నీదుపనాయి నీకుపాలిడినీల్లైసోకుదాయి । సూర్యసోములునీకుసాంప్రైనక
న్నదోయి ♦ నీతనూజుడుభువినాతతాయి । ఘనుడుహనుమంతుడీవుమెచ్చి
నశిఫాయి శిరులనొసగవ్వమన్నించి ♦ శేషశాయి । రహినికూరెళ్ల వెంకట
రామపోషచీతిరేలపురినికాయ ♦ చెన్నరాయ ॥౫౦॥ రాజితనీలనీరదతు
ల్యవరకాయ ♦ సద్గుణాకర సూరిజనవిధేయ । వాసవప్రముఖగిర్వాణస్తుతో
పాయ ♦ వాలఖిల్యాది దివ్యమునిగేయ । కమలాక్షనరమిత్ర కల్యాణస
ముదాయ ♦ ధరణీసురార్పిత దానతోయ । మనుజనరేణ్యదుష్టదశాత్ర
వాకేయ ♦ నిటలాక్షు డెరుగునెనీదుమాయ । మురిపెమె నీకుగక్కసి
♦ ముక్కుగోయ । కరుణవన్నెలుమయ్యభ ♦ క్షఫలదాయ । రహిని
కూరెళ్ల వెంకట ♦ రామపోష । చీతిరేలపురినికాయ ♦ చెన్నరాయ॥౫౧
సారసనమపాణి నీరాణిశ్రీదేవి ♦ విమపకుంటివిపాలకడలిదీవి । జగతిలో
కెంపుతోసరిజంగదెసీమోవి ♦ విరివిగా నీవిచ్చు వరము లేవి । పాడితివీవు
సొంప్రైనపిల్లనగ్రోవి ♦ కడుమనోహరమునీ యొడలితావి । చెలువప్పని
న్నాడి చెలునంచెచిరజీవి ♦ మోదమొందించును నీదుఠీవి । లోకులందరి
వలె ♦ లేదునీకువావి । తలపనీనోరుభువినమ్రము ♦ తంపుబావి । రహిని
కూరెళ్ల వెంకట ♦ రామపోష । చీతిరేలపురినికాయ ♦ చెన్నరాయ॥౫౨
నీభావమునది వర్ణింపవేల్పులబువ్వ ♦ నీపొత్తునకుతిండి నీదుచివ్వ । క
వికిచ్చు వెన్నపైడి గట్టునీకొకగవ్వ ♦ వలనొప్పునినుబోలువాడునవ్వ । వన్న
గానుయశోదనిన్నుబెంచినయవ్వ ♦ తొలగించునాయింటగలుగునెవ్వ । నీ
రధుల్లై మించెనీతాతభువిద్రవ్వ ♦ మతిహీనుడనునెనీ మననునొవ్వ । జను
డన్నైతినివేవేల ♦ జనులునవ్వ । నీవిచిత్రముగన ♦ నేర్తునే వహవ్వ ।

హినికూరెళ్ల వెంకట ♦ రామపోష । చీతిరేలపురినికాయ చెన్నరాయ॥
౫౩॥ కరమొప్పనినుగూర్చి మొరబెట్టిమునుదంతి ♦ నీరదమునుమించునీ
దుకాంతి । నీరాణిశాంతయై నెగడెపంటవలంతి ♦ వృత్తమరాలునీయత్త
కుంతి । భవ్యసంపదలచే ప్రబలెను నీయింతి ♦ బ్రాహ్మనీ కోడలుబ
ల్వదంతి । సతికిచ్చితివి పారిజాతపు పూబంతి ♦ లోకేశ భాండముల్నీకు
దొంతి । ఘనతజెందెనునీవం ♦ శమునసురంతి । నినువగునిగాగబడసె ♦
నుమునునుదంతి । రహినికూరెళ్ల వెంకట♦ రామపోష । చీతిరేలపురినికా
య ♦చెన్నరాయ ॥౫౪॥ నిన్నుపూజించెద నీకృపనేగాంచి ♦నినుగొల్తుస
త్కృతినేరచించి । పన్నుగానెపుడునీవున్నవూరేకించి ♦ దయనేలునాడు
ష్కృతములద్రుంచి । కోమరొప్పజనులునీ కోవెలకేతెంచి ♦ భక్తిచే శ్రే
వించిముక్తిగాంచి। రసనిరంతరము నీయడుగులుభజించి ♦ నీశేవజేయింతు
నినునుతించి । యనఘనాపల్కులాలించి ♦ యతిశయించి । కావలెనిన్ను
గొనియాడు ♦ నేవిరించి । రహినికూరెళ్ల వెంకట ♦ రామపోష చీతిరేల
పురినికాయ ♦ చెన్నరాయ ॥౫౫ చంచలచిత్తయైజరియించెనఖోటి ♦లో
కంబులనులేదు నీకుసాటి । నీచెల్లిగొనిపోయె నేర్పొప్పగకిరీటి । సమశిరి
నీచేతవత్సకోటి । నిగమంబులెరుగునీ నిర్మలవాగాగ్ధాటి కూలెనువాలినీకో
లనాటి । ఖగనాధుడగణితమగుపట్టినీఘోటి♦ భూరినీకీర్తికర్పూరపేటి ।
కోరికలొసంగునాలేమి ♦గోటమీాటి ।ప్రకటబలుడనిమోహిం ♦ చెనో
కనిశాటి। రహినికూరెళ్ల వెంకట ♦ రామపోష। చీతిరేలపురినికాయ♦చె
న్న రాయ ॥౫౬॥ కనులారనీపాద కంజముల్భజియింతు ♦ నీనామకీర్త
నల్నేపఠింతు। నకిలలోకంబులు సాదుటనీవంతు నిఖిలజనంబులునీకుసం
తు । నిన్నునేపూజింతు నీకృపనేగాంతు ♦ నతిరూపమువ జయించితివి
కంతు । మన్నించితివి వినుమనుమడౌహనుమంతు ♦ దునిమెనీచెలికాడు
ఘనకృతాంతు । నరగుననుమోక్షమిచ్చిన ♦ సంతసంతు । విమలమతిచే

తనీకునే ♦ విన్నవింతు । రహినికూరెళ్లవెంకట ♦ రామపోష । చీతిరేల పురినికాయ ♦ చెన్నరాయ ॥౫౭॥ దేవకీపుత్త్రవందితదివ్యచారిత్ర ♦ చాగు నీరదగాత్రసూరిమిత్ర। రాజరాజస్తోత్ర రావణాసురజైత్ర ♦ విమతకానన బృందవీతిహోత్ర । దీనసంరక్ష సాందీపవరఛాత్ర ♦ దాసపవిత్రసీతాకళ త । చంద్రశేఖరమైత్ర సత్కృశేశయనేత్ర♦ వసుమతిభార నిర్వాహచి త్త్ర । వాసుదేవదయాపాత్ర భవ్యసూత్ర ♦ సత్యభామామణీచిత్త జల జమిత్ర రహిసికూరెళ్లవెంకట రామపోష । చీతిరేలపురినికాయ ♦ చె న్నరాయ ॥౫౮॥ నన్నేలవేటికినాపాపములుబాపి ♦ పాలించితివిమున్నప నులజోపి । నిన్నుపూజించనినిర్భాగ్యుడేకోపి ♦ నమధనిందూషించు వా డెపాపి । చెలువప్ప నిన్నుయాచించితిచెయిజాపి ♦ నీసతిసీతమహాసురూపి నినుగెల్తురేపరుల్ నీశౌర్యముంకోపి హెచ్చితివరిసేననేపునూపి । పన్న గాసాదె దయచేతనిన్నుగోపి। ధరణినన్నోబ్వవే నాకుదారిజూపి। రహిని కూరెళ్లవెంకట ♦ రామపోష । చీతిరేల పురినికాయ ♦ చెన్నరాయ॥ ౫౯॥ధరణియశోదమ్మ తలపగానీయమ్మ ♦ నీరాణిసీతబంగారుబొమ్మ । నిజముగాభూదేవినీవుమెచ్చినకొమ్మ ♦ ముదమొప్పరాధనీముద్దుగుమ్మ । నామాటవినకున్ననీమాటనేనమ్మ ♦ నీబొడ్డుబుట్టిన నినువుబమ్మ । చె లగునీభార్యలక్ష్మిదేవి మాయమ్మ ♦ నెగడితౌశుభములునిన్నుగ్రమ్మ। లలినినీకీర్తిహిమశీకర ♦ ములతెమ్మ । దండినీకృతినేకిరా ♦ శకులకమ్మ రహినికూరెళ్ల వెంకట♦ రామపోష । చీతిరేలపురినికాయ ♦ చెన్నరాయ॥ ౬౦ ॥ కోమలిభ్రమసిన గోయించితిపిముక్కు నెమ్మివెంతంబునీవెహా క్కు భ్రాతుపీవనుచు నేవేతునెవుడు మొక్కు పాతకవ్రజము నీచేతసా క్కు । ఘనుడై ననీయన్నగట్లరెక్కలు జెక్కు ♦ భావించినన్నావనీవెది క్కు । ధరణినిన్గొల్చిన ధనసంపదలుదక్కు ♦ నన్నేలునీకీర్తినన్నాకెక్కు। భూతపతియైన నీమాయచేతజిక్కు । లలినినిన్నంతుకన్నముల విడద్రో

కు। రహినికూరెళ్ల వెంకట • రామపోష । చీతిరేలపురినికాయ • చె
న్నరాయ ॥౬౧ నీవాక్యములు హాజనీతికిబలుచక్కపక్కరేడవనినీవక్క
జక్కి। నీచెంతజేరుదు నీయంఘ్రులకు మ్రొక్కి • ముదమొందితివినాతి
ముక్కుజెక్కి। నిన్నుదూరెనువాలి నీకోలచేసొక్కి • బాధించితివిదా
యిపాలు గ్రుక్కి। నమ్మెనీవేమున్న చాకలిమదమెక్కి • నిన్ను సన్ను
తిజేతువన్నెకెక్కి। కీర్తిజెందెనునీబావ • గిబ్బనెక్కి దాతనీకంటెలేడని
వేతుధక్కి। రహినికూరెళ్లవెంకట రామపోష । చీతిరేలపురికాయ • చె
న్నరాయ ॥౬౨॥ పాలుపొందనిన్ను నే పూజింతునిశ్శంక • ఘనుడైవనీ
బంటుగాల్పెలంక । శుభవీక్షణములచేజూడవనానంక • నిన్నునుతిం
చెదనిష్కళంక । ధరణిలోనీబావదాల్చినదేజింక • దాతవీవని నేను వేతు
ఢంక । నిన్ను వేడనివాడనిర్భాగ్యుడగుకుంక • నీదాసజనులతో నేనుబొంక
నీశ్వరుండవునీవఖగేశ్వరాంక । నాకువరమివ్వతున్నను నీకుజంక । రహిని
కూరెళ్ల వెంకట • రామపోష । చీతిరేలపురినికాయ • చెన్నరాయ॥౬౩
గర్వంబుచాతనిన్నదసిరోడెనుభోగి • వసుధనిన్నొల్వనివాడె రోగి । నిన్ను
దల్వనివాడునిర్భాగ్యుడగుమూగి • ఘనుడై నేనీచెలికాడుజోగి । నినురో
టగట్టెను నీతల్లినినులాగి • నీదయగాంతునునీకులోగి ।నిన్నుజూచినవాడు
నిర్మలుడగుయోగి • నినుదూరెరారాజునీటడాగి । మ్రొక్కుదును నేను
నీపాదములకు సాగి । శైలముసు మోసితివిసుధాజలధిగ్రాగి । రహినికూరె
ళ్ల వెంకట రామపోష । చీతిరేలపురినికాయ చెన్నరాయ ॥౬౪॥ బలు
డంచునీయింటబలుసంపదలుమూగు • నరయరక్షింతువష్టాంగయోగు ॥నే
గనుంగొనజాలనీవంటియనురాగు • నిర్జరేంద్రుండైననీకెలోగు । మహి
నిన్ను నమ్మి నేమరకుండుటే బాగు • దందశూకంబెన్నిక్రిందనీగు । భువనగ
తుకుడవై పోషింపవేలాగు • యివుడుసంభరియింపనెవ్వడాగు । జగతినే
లెటిప్రభువుకుతగదుజాగు । దేవనిన్నలేక నత్తితినిజోగు రహినికూరుళ్ల వెంక

రామపోష । చీతిరేలపురనికాయ । చెన్నరాయ ॥౬౫॥ శ్రీమన్నమహా
గాదిశ్రవితాంఘ్రిసరోజ । వర్ణింతునను దేవవరతనూజ । సత్యభామా
మనోజలజాతదినరాజ ధైర్యపర్వతరాజసూర్యతేజ । తతమాధురీసమాహి
తవాక్యవిభ్రాజ । సుందరరతిరాజశుభవిరాజ। గాంభీర్యనదిరాజఘనశౌర్యమృ
గరాజ। మతిభారతీరాజమనుజరాజ। నన్నేలుతైశ్వర్యధనరాజజగతిరాజ ।
గాయకస్తుతపండితకల్పభూజ ।రహినికూరెళ్లవెంకటరామపోష । చీతిరే
లపురినికాయ చెన్నరాయ ॥౬౬॥ నీకీర్తిహిమశైల శీకరంబులమించు
నననినీశరముదైత్యాళిద్రుంచు నీనామమతిపావనికరంబులవధించు నీభక్తు
సేవకులయిననిన్నుగాంచు।నిర్జరేంద్రుండైననీకృపనాసించునిగమంబులెల్లను
సినుపఠించు । నీచేతిచక్రంబునీరజాప్తుహసించు హిమకరునీముఖంబేవ
గించు నీనఖంబులునక్షత్రనికరమొంచు । శౌరినీవనినామది సంతసించు
రహినికూరెళ్లవెంకటరామపోష । చీతిరేలపురినికాయ చెన్నరాయ ॥ ౬౭॥
అలకుచేలునిబ్రోచి నపుడుగొంటివిగోచి చెలనీమీదనే జేతుపేచి ।వి
రివిగానిన్ననే వేడితిచైజాచినరమిన్నవలె నన్నుకరుణజూచి । ధరనేలితివి
మురాసురునినిబడవైచి విలశిల్లితివిసుధాజలధిపేచి ఘనకీర్తిజెందితౌము
నివర్గమునుగాచి శరణంటినేనింతనగకుసైచి । వెలశితౌగోపికావస్త్రము
లనుదాచి । కరుణజూడమునాలేమికడకుద్రోచి । రహినికూరెళ్లవెంకట
రామపోష చీతిరేలపురినికాయ చెన్నరాయ॥౬౮॥ నీదాసహృదయాబ్జనిక
రములీక్షోటద్వారకానగరంబు తమకుపేట । కొంగుబంగరుమూట కో
మరొప్పనీమాట నిరుపమధర్మంబునీకుబాట మన్నించియోగినవే నన్నుజే
యకుకేట బాణుడునిందించబాసెతీట । పారిజాతవనంబు బలువైననీతో
ట సంపూర్ణహిమకరసమలవాట ॥ వాగ్నిరాఘాట దురితకానన కృపీట
భద్మ్రరత్నకిరీటసుపర్ణఘోట ।రహినికూరెళ్లవెంకటరామపోష । చీతి
రేలపురినికాయచెన్నరాయ॥ ౬౯॥ నన్నుతించెదనిన్నుశంకరవరబాణపా

లించుననన్ను వైభవధురీణప్రకటవిశ్వంభరాభరణభక్త త్రాణపుడమిలో లే దునినోర్చిలుణాణ కమునియ్యకరరత్నఘటితతనుత్రాణసకలశాత్రవహర సతు ప్రాణ రణవిజయాక్రాంతరాజితవరతూణ। నేడెంచెదను వేడ్క నీఘ రాణనన్ను పోషించకుండుటనడువ డేన మోదమునన్ను నేలునీపాదనూనా।ర హినికూరెళ్ల వెంకటరామ పోవ ॥ చీతిరేలపురినికాయ చెన్నరాయ ।౨౦।

గీ॥ రశికుడయినట్టి వెంకటరామయకును।యింతిపూజించినమయంతికెనయును దగు। పతిహితంబున భువిసరుంధతినిబోలి। వన్నె కెందేనుగదమేటి చెన్న మాంబ గీ॥ గలిగెనీరికిసూనుడై లలితకరుడు । సత్యమందునగలహరి శ్చంద్రుమాడ్కి। పంకితాళినిపూజించుపరమదయను।నమితధీరుండు చెన్న య్యనామకుండు॥

మంగళహారతి.

మంగళంబనిపాడరె జలదాంగుడగుపత్నికి. సుసహితరంగద్గుణతతికి వృషభ తురంగస్తుతమతికి శ్రీరంగన్నపతికి భృంగవేణులారమేల్మిబంగారు నివాళులిచ్చి ॥ మంగ ॥ సూరిజనమందారుడెగిరిధీరుడగుహరికీ ॥ యాతనినారియగుశిరికీ జగదుపకారవార్ధిరికీ వైరివిదారికిసఖులారముదమున జేరిగారవంబుమీరచారు హారతియొసంగి ॥ మంగ॥ పన్నుగామనచీతిరేలచెన్నరాయునకు కల్యాణోన్నతప్రాయునకు ॥ కవిహితసన్నుతకాయునకు ఫలదాయునకు పసన్నుడయినవెన్నునాకు వన్నెలొప్ప కన్నెలార ప్రసన్నచేకూరెళ్ల వెంకటరామయను నేలిదాసులలేములనుదోలి । భవ్యస్తోమమివజాలివనమాలి సొగసగుకామితంబులిచ్చి ప్రోచు శ్రీనుసోనుభావునాకు। మంగళం॥

సంపూర్ణం

శ్రీ

## శివస్తవము

:[౦]:

శ్రీకాళికాదేవిచిత్తసారసలోల । శరదభ్రనిభదేహచర్మచేల ।
నిరతకల్మషతూల నిర్ఘాతవాతూల వగధీరవరకగుణాలవాల । తత
మాధురీసమాహితభవ్యవాగ్జాల నిరుపమగాంభీర్య ధరితశూల । పద్మ
నాభాదినద్భక్తహృత్పరి శీలవాసవప్రముఖ దివ్యానుకూల। దేవదేవమ
హాదేవధీవిశాల । కపటమగదూషదుర్మదరిపువిఘాల। ప్రేమకూరెళ్లవెం
కటరామయకును । మేలొసంగినశ్రీచీతిరేలగిరిశ ॥౧॥ నీకొమారుడుసురా
నీకంబులకుపెద్ద ఘనుడగ్ని నీముఖకంటిగ్రుడ్డు । నీచెలికాడుమున్నీటగ
ట్టెను రొడ్డుకైవేటుబడెవేల్పుగములదొడ్డు । భీకిల్లయమునకుబెట్టితివకట్ట
డ్డు। దాల్చెనీదయశౌరితమ్మిబొడ్డు । గళమందుదాల్చితౌకాలకూటపు
డ్డునీవాజిమొగదైననావుగొడ్డు।పుడమినీతలనెలపుట్టుకడలిబిడ్డు। నాకుకోరిక
లీకున్న నీకుసొడ్డు । ప్రేమకూరెళ్లవెంకటరామయకును । మేలొసంగిన
శ్రీచీతిరేలగిరిశ ॥౨॥ చెలువప్పజొహారుచేతుచేతులరెంట తెగజూచివిమా
రునగినికంట । భాసురంబుగనీవుబట్టినదేగంట లోకంబునను లేదునీకుజం
ట । నిరతమైశ్వర్యముల్నగజానునీయింట కరమర్థినిన్నాంతుగరళకంఠ।
పద్మనాభునిల్చెబాణమైనీవింట వసుధనిన్ననివాడెకుంఠ । మరుమునీ
ప్రమోలబట్టెను చెరుకుతుంట । సంతతము బావు నాకల్మషములతంట

రెళ్ల వెంకటరామయకును । మేలొసంగిన శ్రీచీతిరేలగిరిశ ॥౩॥ ని
రంగు నీబలవిస్ఫూర్తి తొలగింపవేనాదుదుష్కృతార్తి । ని
యువ్వనుతింప నేగవునీమూర్తి నెరిజగంబులమించెనీదుకీర్తి । భాను
శ్రితవర భక్తమానసవర్తి నిష్టచేనగడినయష్టమూర్తి । వేసెనీదయ
ంచె విష్టరశ్రీశమూర్తి వసుధనిన్నన్నినివాచుధూర్తి । సన్నుతించెను
నుశిబిచక్రవర్తి । గుట్టుగాగొల్వనాపేరుభట్టుమూర్తి । ప్రేమకూరె
ళ్ల వెంకటరామయకును । మేలొసంగిన శ్రీచీతిరేలగిరిశ ॥౪॥ త్రిపురవాసు
లను మర్ధించివటనీవు వాసిగుబ్బలితమరుండుతావు । పెక్కుమాయలు
నీవెదికన్నగనిరావు । నీచరకసూలను బ్రోచినావు । ఘనముప్పనిన్ను
జెందెనుశుభంబులప్పోవు సన్నుతిజేసితినన్ను బ్రోవు । నిబ్బరంబైనబల్గిబ్బ
డి నీమావు । నిర్జరులెరుగరునీదులావు । యిపుడునేబడుకష్టంబులెరుగవీ
వు । యెరిగినందుకుఫలమేమియివ్వదగావు ॥ ప్రేమకూరెళ్ల వెంకటరా
మయకును । మేలొసంగిన శ్రీచీతిశేలగిరిశ ॥౫॥




బ్రహ్మవిష్ణుమహేశ్వరార్పణమస్తు ।

సంపూర్ణం.